

శ్రీమతే రామానుజాయ నమః

# న్యాసదశకమ్




మలయప్పస్వామి, తిరుమల



'పండితరత్న'

డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అళ్గ శింగరాచార్యులు

సమర్పణ: మొలుగు వేంకటాచార్య, తిరుచనూరు

వంగల వేంకట కేశవ అయ్యంగారు

# న్యాసదశకమ్

అవతారిక:

ప్రపత్తిని ఉద్దేశించి రచింపబడిన పది శ్లోకాలను కలిగిన ఈ స్తుతికి న్యాసదశకమని పేరు. న్యాసమంటే ప్రపత్తి. ఇది వరదరాజస్వామి విషయంగా రచింపబడింది. ఆ స్వామి పాదాలలో ప్రపత్తి చేసిన దేశికులు ప్రపత్తికి చెందిన పలు విషయాలను ఈ చిన్న స్తోత్రంలో పొందుపరచారు. భరసమర్పణాన్ని చేయవలసిన ఆవశ్యకత, దాని అయిదు అంగాలు, సాత్త్వికత్యాగాన్ని చేసే రీతి, మోక్షాన్ని అనుగ్రహించమని అర్థించడం, ఇక్కడ ఉండే కాలంలో కైంకర్యాన్ని ప్రార్థించడం, పాపాలను సహించమని అర్థించడం, చివరగా సాత్త్వికత్యాగం చేయడం మొదలైన పలు అంశాలు సంగ్రహంగా తెలుపబడ్డాయి. దీనిని ప్రతిదినం గృహాలలో ఆరాధనాసమయంలో పారాయణం చేయడం చిరకాలంగా కొనసాగుతున్న శిష్టసంప్రదాయం.

★★★★★

1) అహం మద్రక్షణభరో మద్రక్షణఫలం తథా,
న మమ శ్రీపతేరేవేత్యాత్మానం నిక్షిపేద్బుధః ॥

నేను అనే ఆత్మస్వరూపం నన్ను రక్షించుకొనే భారం, నా రక్షణవల్ల కలిగే ఫలం—ఇవన్నీ నావి కావు. అవి శ్రీపతివే—అని తలచి, తత్త్వజ్ఞానాన్ని పొందినవాడు ఆత్మసమర్పణాన్ని చేయాలి.

2) న్యస్యామ్యకిఞ్చనః శ్రీమన్ననుకూలోఽన్యవర్జితః,
విశ్వాస ప్రార్థనాపూర్వమాత్మరక్షాభరం త్వయి ॥

లక్ష్మితో కూడి ఉండే వరదరాజస్వామీ !నీకు అనుకూలుడనై, నీపట్ల ప్రతికూలభావాన్ని విడచినవాడనై, వేరు ఏ ఉపాయాన్ని ఆచరించడానికి యోగ్యతను లేనివాడనై, మిక్కిలి నమ్మకాన్ని, రక్షించమనే ప్రార్థనను పురస్కరించుకొని నన్ను రక్షించే భారాన్ని నీ సన్నిధిలో సమర్పి స్తున్నాను.

3) స్వామీ స్వశేషం స్వవశం స్వభరత్వేన నిర్భరమ్,
స్వదత్త స్వధియా స్వార్థం స్వస్మిన్న్యస్యతి మాం స్వయమ్ ॥

నాథుడైన భగవానుడు తనకు శేషమై ఉండేవాడను, తనకు వశుడనైన నన్ను తనచేతనే అనుగ్రహింపబడిన తనకు సంబంధించిన జ్ఞానంతో తన ప్రయోజనంకోసమే నాకు ఏ బాధ్యత లేని రీతిలో తానే తనవద్ద సమర్పించుకొంటున్నాడు

4) శ్రీమన్నభీష్టవరద త్వామస్మి శరణం గతః,
ఏతద్దేహావసానే మాం త్వత్పాదం ప్రాపయ స్వయమ్ ॥

లక్ష్మితో కూడుకొని ఉండేవాడా !ఇష్టమైన వరాలను ఇచ్చేవాడా! నిన్ను శరణు పొందినవాడనై, ఉన్నాను. ఈ శరీరం ముగిసిన తరువాత నన్ను నీవే స్వయంగా నీ పాదాల దగ్గరకు చేర్చుకో.

5) త్వచ్ఛేషత్వే స్థిరధియం త్వత్ప్రాప్త్యేక ప్రయోజనమ్,
నిషిద్ధకామ్యరహితం కురు మాం నిత్య కిజ్కరమ్ ॥

నీకు శేషమై ఉండడంలో స్థిరమైన బుద్ధిని కలవాడనై, నిన్ను అనుభవించడమే ప్రయోజనంగా కలవాడనైన నన్ను నిషేధింపబడిన కర్మలను,

అల్పఫలాలను ఇచ్చే కర్మలను ఆచరించనివాడనుగా, నీకు నిత్యకైంకర్యాన్ని చేసేవాడనుగా చేయాలి.

6) దేవీ భూషణ హేత్యాది జుష్టస్య భగవం స్తవ,
నిత్యం నిరపరాధేషు కైఙ్కర్యేషు నియుఙ్క్ష్వ మామ్ ॥

భగవన్! లక్ష్మీదేవి, దివ్యాభరణాలు, దివ్యాయుధాలు మొదలైనవారు ప్రీతితో సేవించే నిన్నుగూర్చిన, అపరాధంతో కలవని కైంకర్యాలలో నన్ను ఎల్లప్పుడు నియమించు.

7) మాం మదీయఞ్చ నిఖిలం చేతనాచేతనాత్మకమ్,
స్వకైఙ్కర్యోపకరణం వరద స్వీకురు స్వయమ్ ॥

వరదరాజస్వామీ! నన్ను, చేతనాచేతనాలనే రెండు విధాలైన, సకలమైన నా వస్తువులను నీవే స్వయంగా నీ కైంకర్యానికి సాధనాలుగా చేసికో.

8) త్వదేకరక్ష్యస్య మమ త్వమేవ కరుణాకర!,
న ప్రవర్తయ పాపాని ప్రవృత్తాని నివర్తయ ॥

కరుణకు నిలయమైనవాడా! నీచేత రక్షింపబడవలసిన నాకు నీవే పాపాలు కలగన రీతిలో చేయాలి. ఇంతకు ముందు చేసిన నా పాపాలను పోగొట్టు.

9) అకృత్యానాఞ్చ కరణం కృత్యానాం వర్జనఞ్చ మే,
క్షమస్వ నిఖిలం దేవ ప్రణతార్తి హర ప్రభో ॥

నిన్ను శరణు పొందినవారి దుఃఖాలను తీర్చినవాడా ! దేవా! అన్నిటిలో సామర్థ్యాన్ని కలవాడా! నేను అకృత్యాలను చేసినందువల్ల కలిగిన దోషాలను,

చేయవలసినవానిని, చేయకుండా విడచిపెట్టినందున కలిగిన దోషాలను అన్నిటిని క్షమించు.

10) శ్రీమన్నియతపఞ్చాఙ్గం మద్రక్షణభరార్పణమ్,

అచీకరత్స్వయంస్వస్మిన్నతోऽహ మిహ నిర్భరః ॥

లక్ష్మిని కలవాడైన వరదరాజస్వామి నియతంగా అయిదు అంగాలను కలిగిన, నన్ను రక్షించే భారాన్ని సమర్పించడమనే భరన్యాసాన్ని తనవద్ద తానే చేసికొన్నాడు. అందువల్ల దాసుడనైన నాకు ఏ భారం ఈ విషయంలో లేదు.

సంసారావర్తవేగప్రశమనశుభదృగ్దేశిక ప్రేక్షితోऽహం,

సన్త్యక్తోऽన్యైరుపాయైరనుచితచరితేష్వద్య శాన్తాభిసన్ధిః ||

నిశ్శఙ్కస్తత్త్వదృష్ట్యా నిరవధికదయం ప్రార్థ్య సంరక్షకం

త్వాం,న్యస్యత్వత్పాదపద్మేవరదనిజభరం నిర్భరో నిర్భయోऽస్మి||

న్యాసదశకం సంపూర్ణమ్

★★★★★